ంగారకావ్యగ్రంథమండలి ప్రబంధపరంపర

# సత్యభామా సాంత్వనము.

లింగనమఖి శ్రీకామేశ్వర కవికృతము.

---

PUBLISHED BY
K. G. MURTHY.
FOR SRUNGARA KAVYA GRANDHA MANDALI.
1000 COPIES.



తంజావూరు వీర రాహూతుల పాలనలో, ఆంధ్రవాణి ఏలా వింత విలాసములతో చవులూరించి, కావ్య రసికులకు హాయి నలవరచిందో- రాధికాసాంత్వనములో- విశదమై ఉంటుంది.

సత్యభామాసాంత్వనము, మధురనాయకుల కీర్తిని చిరస్థాయిగా నిలిపే సప్తసంతానములలోనిది. కృతిపతి, తిరుమలనాయకుని మనుమడు అళఘురి, తిరుమలేంద్రుడు, క్షేత్రయ్యను సముఖానికి రప్పించుకొని బహు కాలము నిలుపుకొన్న సరసనాయకుడు. (కృతిపతిని మెప్పించడానికీ, క్షేత్రయమీది ఆదరణచేతా, శ్రీ కామేశ్వరకవి, పదభావములను అక్కడక్కడ సంతరించి వినియోగించుకున్నాడు) తాతను బోలిన మనుమడే అళఘురికూడాను, అన్నివిధములచేతా అని, శ్రీ కామేశ్వర కవి స్పష్టంగా చెపుతున్నాడుకదూ, గ్రంథారంభంలో. అళఘురి అన్న చొక్కనాథుడు కూడా శృంగార అనుభవాల విషయంలో వీరెవరికీ తీసిపోని వాడు అనిపించుకున్నాడు రాజ్యానికి వచ్చిన తరువాత. ఈతని మీద, షోకైన చాటువులు శరభోజీ భాండారంలో ఉన్నవి.

శ్రీ కామేశ్వర కవిది విశేషించి ప్రౌఢమైన కవిత్వం. దానికి వన్నెగా, అచ్చతెలుగులూ, దేశ్యాలూ, సంస్కృతానికి తూకం తరిగి పోకుండా ఉండేటట్టు తలమున్కలుగా గ్రంథమంతటా విరజల్లేశాడు. అందుచేత వ్రాతప్రతులనిండా, విలేఖరుల దోషాన స్ఖాలిత్యాలు అనేకం పాదుకు పోయినవి.

ముద్రణమునకు సాధుప్రతిని సిద్ధముచేయడానికి, పరిశోధనావసరాల్లో విశేషంగా శ్రమపడవలసి వచ్చినది. తెలుగునాటను లభ్యమవూతూన్నవానిలో, ఏప్రతినీ చూడకుండా విడువలేదు. శ్రీ కామేశ్వర కవి ఉత్తమరచనను, సహృదయులకు, అందించ గలిగినందున, మాకృషి ఫలించినది.

వ్యవస్థాపకుడు.

# భూమిక.

దక్షిణాంధ్రవాఙ్మయమున నెన్నికఁ గన్న రసవత్ప్రబంధములలో సత్యభామాసాంత్వన మొకటి. ఈ కృతి మధురాపురరాజ్యమున వెలసిన వానిలోఁ బ్రాచీనము-ప్రశస్తము. విజయనగరసామ్రాజ్యవిచ్ఛిన్నానంతరము తంజావూరు, మధుర, పుదుక్కోట, సేలము, కార్వేటినగరము మున్నగు రాజ్యములాంధ్రసాహిత్యసంపద కాస్పదము లైనవి. అందు మధురను క్రీ. శ. 1670 ప్రాంతములఁ బరిపాలన మొనర్చిన ముద్దళఘురి కంకితముగా నీ కృతిని రచియించినకవి.

—: లింగనమఖి శ్రీకామేశ్వరకవి :—

ఈతనిపేరు శ్రీకామేశ్వరకవి యని తెలియు చున్నను నీ వఱకు ముద్రించినవా రెల్ల రీతనిపేరు కామేశ్వరకవి యని ముద్రించినారు. కీర్తి శేషులు వీరేశలింగముపంతులవారి కవులచరిత్రము నం దేమి, ప్రాచ్యలిఖిత పుస్తకాగారవివరణము లం దేమి, శృంగారగ్రంథమాలాముద్రణము నం దేమి గ్రంథకర్త కామేశ్వరకవి యనియే యున్నది. ఈతఁడు తన గద్యమున 'శ్రీకరకవితాకరసుజనవిధేయ శ్రీకామేశ్వరనామధేయప్రణీతం బైన' అనియే వ్రాసికొని యున్నాడు. నేను బరిశోధించి చూచిన తాళపత్రగ్రంథముల నిట్లే యున్నది. ఇంతియకాక శ్రీకామేశ్వరకవి తన్నుఁ గూర్చి చెప్పుకొనుసందర్భమున.

"కం. కాకులవలె నిం టింటను
కాకవు లున్నారు హంసకైవడి భువిలో
శ్రీకామ! నీకె తగురా
యేకడ నుడి పాలు నీరు నేర్పఱుపంగన్."

"కం. ఏభాష నైనఁ గృతిపతి
శోభనములఁ జెందు నీదు • సూక్తులవలనన్
సౌభాగ్య మనదృశముగా
శుభకరుణానివేశ! • శ్రీకామేశా!"

ఇందుఁ దొలిపద్యమునఁ బ్రాసముకొఱకును రెండవపద్యమున యతికొఱకును 'శ్రీ' చేర్చినాఁ డనియందు రేని యీతని యీక్రింది పద్యమునుఁ దిలకింపుఁడు.

"చ. అనుపుగ రుక్మిణీపరిణ • యంబును మున్ రచియించి యార్యు లౌ
ననఁ దనియించినావు మము • నప్రతిమంబుగ నవ్యకావ్యమిం
పున రచియించు మీ సొగసు • పోఁడిమి మీఱఁగ సత్యభామసాం
త్వన మనఁ గప్పురంపుచలు • వన్ గెలువన్ దిరుకామసత్కవీ!"

ఇచట శ్రీకామశబ్దమునకు తిరుకామ యని వాడినాఁడు. శ్రీశబ్దమునకు ద్రావిడమున 'తిరు' అనురూపము వచ్చును. తిరుమల, తిరువేంగడ, తిరుమంజన, తిర్వళిక మొదలగుపదము లిట్టివే. వైష్ణవసంప్రదాయమున 'తిరు' శబ్ద మాది యగుశబ్దములే మన కన్నియుఁ గానవచ్చుచుండును. ఇంతియేగాక శ్రీకామేశ్వరకవికృతము ధేనుమహాత్మ్య మను వచనకావ్యము తంజావూరుపుస్తకశాలలోఁ గలదు. అందుఁ గూడ.

"ఉ. వివిధకలాకలాపఖని • వెంగనలింగమహీంద్రునాగ స
త్కవి తిరుకామ కోవిద • శిఖామణి"

అని స్పష్టముగాఁ జెప్పికొని యున్నాఁడు. కావున నీతనిపేరు శ్రీకామేశ్వరకవి యగుట నిశ్చయము.

శ్రీకామేశ్వరకవి తొలుత శ్రీకాళహస్తినివాసుఁడై యా వెనుక మధురాపురమున రాజసమ్మానములఁ గాంచియచ్చటనే స్థిరపడినవాఁడు. గద్య యందలి 'శ్రీకాళహస్తీశ్వరచరణారవిందమిళిందాయమానాంతరంగ, జ్ఞానప్రసూనాంబికాకృపావలంబిత[illegible]సారస్వత సుధాతరంగ' అనువాక్యమును '[illegible] తిరుమల[illegible]

కాంతకరుణాకటాక్షలక్షితస్వచ్ఛముక్తాగుచ్ఛసితచ్ఛత్రచామరకళాచికకవ కాందోళికాదిరాజోపచార ' అనువాక్యమును నీ విషయము తెల్లము సేయు చున్నది. కామాక్షమ్మ, నాగన యీతని తలిదండ్రులు. ఈతనివంశమున బహుమఖముల నాచరించిన లింగనమఖి ప్రసిద్ధుఁ డగుటచే నీతని యింటి పేరు లింగనమఖివా రైనది. ఈతఁడు సంస్కృతాంధ్రములయం దసమాన పండితుఁ డై, సరసకవితాసంపన్నుఁ డగుటయే గాక సంగీతమునఁ బ్రసిద్ధిఁ జెందినవాఁడు. గద్యయందలి ' వల్లకీవాదనధురీణ ' యను విశేషణ మీతనివీణావాదనముఁ దెలుపు చున్నది. మఱి నీతఁడు గేయకృతులు పెక్కులు రచియించి నట్లు ' వర్ణగీతాదిగాంధర్వస్వరనవీనకల్పనాప్రవీణ ' యనునది స్పష్టపఱచు చున్నది. ఈతని ప్రబంధకృతులలో నిపుడు సత్య భామాసాంత్వనముఁ దక్క తక్కినవి కానవచ్చుట లేదు. ఈతఁడు తొలుత రుక్మిణీపరిణయము రచియించిన ట్లీపఱి కుదాహరించిన పద్యము వలననే గాక

"తే. గీ. తనదు దక్షిణనాయక • త్వమున కుచిత
ముగను ముద్దళఘురిశౌరి • ముదమునీఱు
నపటిరుక్మిణీపరిణయం • బందు కతఁ
దా నిపుడు సత్యభామసాం • త్వనముఁ గోర. "

అను పద్యమువలనఁ దెలియు చున్నది. ఇదియు ముద్దళఘురి కంకితముగా వెలసినది. ఈతనికృతి వే ఱొకటి ధేనుమాహాత్మ్య మను వచనకావ్యము గలదు. ఇది యముద్రితము. తంజావూరుపుస్తకాలయ వివరణమునఁ గల దీనివిషయముఁ గొంత తెలుపు చున్నాఁడను. ఇది సత్యభామాసాంత్వనకృతిపతి ముద్దళఘురి నవతియన్న యగు చొక్క నాథనాయనివారికిఁ గృతి.

" శా. శ్రీరామామణి వింతగా నురమునం • జెన్నొందఁ గొ ల్వుండఁ
తే రంగంబును కట్టుమట్టునపదా • దివ్యత్కృపాధారక్షి
రాధూఢిం దగెఁ గామధేనువు వలెన్ • రక్షించి లోకంబులో
శ్రీరంగేశుఁడు చొక్కనాథ...కౌరిన్ వేడుక న్బ్రోవుతన్. "

అను పద్యముతోఁ బ్రారంభిల్లినది గ్రంథ మంతయు వచనకావ్యం బుగా రచియించినాఁడు. గ్రంథముకడపట—

"చ. వివిధకలాకలాపఖని • వెంగనలింగమఖీంద్రునాగ స
త్కవి తిరుకామకోవిదశి•ఖామణి ధీరులు పాకవైరిలో
కవికచకల్పకస్తబక•గంధధురంధరసూక్తియుక్తి నౌ
నవు నని మెచ్చనావులమ•హాత్మ్య మొనర్చెను తేఁటమాటలన్.

అనుపద్యము గలదు.

ఇందు తేఁటమాటలతో గోమాహాత్మ్యము ధర్మరాజునకు భీష్ముఁడు చెప్పట వర్ణింపఁబడినది. అశ్వాసాద్యంతవిభాగములేదు. ఇందలి వచనరచనకు నీ క్రిందిపఙ్క్తుల నుదాహరించెదను.

"సత్యలోకమున నివి యజ్ఞసంగతి నివసించు హోమమ్ముల నెల్లను వీనిపాలచే చమురు నుపయోగించు కొమ్ములు నెమ్ములు చర్మములు నున్ననితోఁక రోమములు పేడ పంచితమును నన్నింటికి నుపకరించు. గాలిని, చలిని, ఎండను వీనికి బడలిక లేదు. కావున నా యీ సమయమ్ముల తమకు నుచితమ్ము లైనవను లివి సేయు. కావున నాఫును బ్రాహ్మణుండును నేకతత్త్వ మ్మగుటం జేసి పరమపదంబు జెందు నందున గోబ్రాహ్మణులు సమానవస్తువు లని పెద్దలు పలుకరింతురు. అవుపాలమృతం బని యమకవిభుండు పలుకరించె."

వచనరచన యధునాతనకాలమునఁ దక్క యంతకుఁ బూర్వము లేదనువా రీగ్రంథమును జూడఁ దగుదురు. ఇది ముద్రణభాగ్య మందిన యాంధ్రవచన కావ్యవికాసముఁ గూర్చి కొంత తెలిసికొన నవకాశము గల్గును. ఈ మధురాపురమున క్రీ. శ. 1720 సంవత్సరప్రాంతమున వెలసిన సముఖము వేంకటకృష్ణప్పనాయకుని వచనజైమినిభారతము దీనికిఁ దరువాతిదియే.

శ్రీకామేశ్వరకవి ముద్దళఘురితాత యను తిరుమలనాయకుని కాలమున నున్నవాఁ డగుటచేతను, తిరుమలనాయకుఁడు క్రీ. శ. 1623 మొదలు

1659 వఱకు మధురను బరిపాలించినవాఁ డగుటచేతను, క్రీ. శ. 1670 సంవత్సరప్రాంతమున ముద్దళఘురి సత్యభామాసాంత్వనముఁ గృతి నందుటచే నీతఁడు క్రీ. శ. 1670 ప్రాంతమువఱకు జీవించె ననిచెప్ప నొప్పును. కవిని గూర్చి యింతకన్న మన కేమియుఁ దెలియ రా లేదు.

సత్యభామాసాంత్వనము నాలు గాశ్వాసముల శృంగారప్రబంధము. ఆంధ్రవాఙ్మయమున సాంత్వన మనుపేరుగల కావ్యములలో నిదియే తొలుతగాఁ గన్పట్టు చున్నది. దీనివెనుక సముఖము వేంకటకృష్ణప్ప నాయఁడు రాధికాసాంత్వనమును దాని ననుసరించి ముద్దుపళని రాధికా సాంత్వనమును వెలసినవి. ఇందు మొదటిది మధురాపురాంధ్రకృతి— రెండవది తంజాపురాంధ్రకృతి — ఈ గ్రంథమునకు మూలము భాగవత హరివంశముల యందుఁ బ్రస్తుత మైన నరకాసురవధఘట్టము— నరకాసుర వధానంతరము సత్యభామమానము నామె శ్రీకృష్ణుఁడు సాంత్వనము సేయుట నిందు ముఖ్య మగువిషయ మగుట కవి యీ గ్రంథమునకు సత్యభామాసాంత్వన మనుపే రిడినాఁడు. శ్రీకృష్ణదేవరాయలవా రాముక్తమాల్యదయందు ' సత్యావధూప్రీణనము అను సంస్కృతకా వ్యము రచియించి నట్లు ' 'భావధ్వని వ్యంగసేవధి గాఁగఁ జెప్పితివి సత్యా వధూప్రీణనంబు'నను పద్యపాదము తెలుపు చున్నది. బహుశః సంస్కృత సత్యావధూప్రీణనము దీనికి మూలమేమో తెలియ రాదు.

ఇందుఁ దొలియాశ్వాస మంతయు నవతారిక యనియే చెప్ప నగును. శిష్టాచారప్రకార మిష్టదేవతానంతరము ముప్పదినాలుగు పుటలలో మధురనాయకుల వంశక్రమ మెంతయు విపులముగ వర్ణిత మైనది. ఇది చరిత్రకారుల కెంతయు నుపయుక్తము. ఆ వెనుక కథాప్రారంభమున ద్వారకాపురవర్ణనమును శ్రీకృష్ణుఁడు ద్వారక నేలు నవిమాత్రమే తెలుపఁ బడినది. రెండవ యాశ్వాసమున నింద్రాగమనము నింద్రుఁడు నరకాసురుని వృత్తాంతముఁ జెప్పి శ్రీకృష్ణునిచే నరకాసురుని వధింతు నని ప్రతిజ్ఞ సేయించుటయు, వసంతోత్సవవర్ణనము, శ్రీకృష్ణసత్యభామల విహారమును, యుద్ధయాత్రకు సత్యభామ బయలుదేరెద ననఁ శ్రీకృష్ణుఁడు

నివారించుటయు, నరకాసురపుర మగు ప్రాగ్జ్యోతిషపురీసమీపమున దండు విడియుటయు, ద్వారకలో సత్యభామావిరహమునుఁ జెప్పఁ బడినవి.

మూఁడవయాశ్వాసమున దండు విడుదల యందు శ్రీకృష్ణుని విరహావస్థయు, కలహింకుని హాస్యప్రసంగమును సత్యభామవద్ద నుండి చిలుకరాయభారమును కృష్ణుఁడు విరహమును సహింపఁ జాలక ప్రద్యుమ్న కుమారుని సత్యభామను దోడితెచ్చుటకుఁ బంపి యామెను రప్పించుటయు వర్ణితము.

నాలుగవయాశ్వాసమున నరకాసురునిబంటు పూర్వజన్మవృత్తాంతముఁ జిలుక చెప్పుటయు, వానివలన నరకాసురునియుదంతము కృష్ణుఁ డెఱుంగుటయు, వర్షశరదృతువర్ణనములును, యుద్ధప్రారంభమును సత్యభామ యుద్ధకౌశలమును, నరకాసురసంహారమును, అదితి కుండలదానంబును, భగదత్తపట్టాభిషేకమును నరకుని చెఱయం దున్న పదాఱువేల చేడియల శ్రీకృష్ణుఁడు పెండ్లి యాడుటయు, సత్యభామప్రణయకోపమును శ్రీకృష్ణుఁ డామెసాంత్వనము సేయుటయు, ఫలశ్రుతితో ముగింపును గలవు.

ఇందు శృంగారరసము ప్రధాన మైనను నెడ నెడ వీర, రౌద్ర, హాస్యరసములు పోషింపఁ బడినవి. శృంగారలీలాప్రపంచనాటకసూత్రధారి శ్రీకృష్ణుఁడు నాయకుఁడు. శృంగారరససీమ సత్యభామ నాయికగా నున్న యీరసవత్కృతి యందుఁ దద్రసస్థాయి యగు రతివర్ణన మత్యుత్కటముగాఁ గావింపఁ బడినది. విరహావస్థయుఁ బూరుషాయితక్రియలు నతిమాత్రముఁగా వర్ణితము లైనవి. వీరరౌద్రరసములును నద్భుతరసమును, సత్యభామయుద్ధవిహారఘట్టమునను, హాస్యము కలహింకుని వచోధోరణి యందునుఁ బొందుపడినవి. శ్రీకామేశ్వరకవి బహుధానమర్థుఁ డగుట కావ్యము రసనిష్యంద మై, రసికజనహృదయంగమ మై యలరునట్లు రచియించి కీర్తిఁగాంచినాఁడు.

ఆ యా రసవర్ణనలకు నీ క్రిందిపద్యము లుదాహృతములు. శృంగార వీరరసమునకు:—

సీ. కంకణక్రేంక్రియల్ ♦ కటుచాపటంక్రియల్
చిఱునవ్వు మొలయింపు ♦ తేపురింపు
కలవాగ్స్వరావముల్ ♦ కహకహారావముల్
గొల్లన నగుముద్దు ♦ గొరకపద్దు
సరససల్లాపంబు ♦ సంగ్రామకోపంబు
వింతసొగసుఝాక ♦ వెగటుతేక
సొంపుమీఱినవైపు ♦ తుఱచుఱ మనుచూపు
బులుపులు తగునంగు ♦ పొగరుపొంగు

తే. గీ. సరసశృంగారవీరర♦సంబు లమరు
కొమరు తగి యుండ మెయిఁ జెఱు♦చెమట నిండఁ
బోరు గావించె రిపుసేన ♦ బో రవంగఁ
గల్లవగగొల్లదేవేరి ♦ కడఁక మీఱి.

రౌద్రశృంగారమునకు:—

సీ. సంవర్తకీలియై ♦ చంద్రికాపాళియై
కనుగెంపు నగుపెంపు ♦ గ్రక్కతిల్లఁ
బటుకాలదూతియై ♦ పంచాస్త్రహేతియై
చాపంబు రూపంబు ♦ సంఘటిల్ల
నశనిదుర్ధరమై ♦ యతిసుధావర్షమై
విడిసద్దు నుడిముద్దు ♦ విస్తరిల్ల
నుల్లాసనాభియై ♦ యురుమోహశోభియై
శరవృష్టి కచవృష్టి ♦ పరిఢవిల్ల

తే. గీ. దితిజదితిజాంతకులకు ను♦ద్వేగరాగ
సంగతులు పొంగ వంగనా♦జనమతల్లి
కినిసి యుమఁ జేసె ధీచమ♦త్కృతి వినిద్ర
రౌద్రశృంగారరసము తో♦రా యనంగ.

శృంగా రాద్భుతమునకు :—

సీ. వెన్నెలమూఁకయో ♦ విడియెండకాఁకయో
యన నొప్పెఁ జంద్రాస్య♦మినుకుచూపు
మరుకీర్తి తెక్కయో ♦ నెఱలోఁకచుక్కయో
యన నొప్పెఁ దెరవము♦త్యపుఁదురాయి
పూఁదేనెసోనయో ♦ వాడిరాతివానయో
యన నొప్పెఁ మగువగా♦యకపుమాట
జంత్రవిశేషమో ♦ శతధారఘోషమో
యన నొప్పెఁ జెలివింటి♦గొనముసద్దు

తే. గీ. మొనయుశౌరికి వైరికి ♦ మోదఖేద
ములను శృంగారరసము న♦ద్భుతరసంబుఁ
దోఁచ నారాచముల నేసి ♦ దురముఁ జేసెఁ
గుతుకకోపంబుల నెసంగి ♦ కోమలాంగి.

శ్రీకామేశ్వరకవి యుభయభాషల యందు వైదుష్యముగలవాడయ్యును దన కవిత యందు జాతీయముల నుపయోగించి తెలుఁగుకవి యనుపేరును సార్థకముఁ గావించికొనినాఁడు. కవితఁ గూర్చి

సీ. సరసత భువనంబు ♦ చల్లనై విలసిల్ల
సారస్వతస్ఫూర్తి ♦ సంఘటిల్ల
వనమయూరాధిక♦వాఙ్నైపుణి పొసంగ
యనటద్ధారాళి♦కయు మెసంగఁ
బటుతరోదితకదం♦బంబులు ననలొత్త
వెలుఁగుపడఁగనైన♦మెఱుఁగు హత్త
సాహృదకవిరాజ♦సంఘంబు హర్షింపఁ
గూలంకషాభోగ♦లీల మించ

తే. గీ. నమృతవర్షము గురిసిన ♦ యట్లు ఘనత
వెలయఁ గాఁ గిరి కందళం♦బులు చెలంగఁ

శ్రీరస్తు.



# సత్యభామాసాంత్వనము.



## ప్రథమాశ్వాసము.



శ్రీమహికన్య యాత్మకర
చిన్మయముద్రికఁ జూచె దేమి నా
నీ మొనగుబ్బ లే నలము
నీటిది మానఁగలే నటంచుఁ దా
నామెయిఁ దెచ్చి కల్మి విన
తాళి కొసంగుదు నంటఁ దెల్పు శ్రీ
రాముడు ముద్దుల శ్రీధ
రారమణుం గరుణించుఁగావుతన్.

మ. తనప్రాణేశ్వరునంకపీఠమున నుద్యల్లీలఁ గొల్వుండి భ
క్తనికాయమ్మున కే నుదారయశముల్ గల్గింతు నన్నట్లు దా
హనుమంతుం దయఁ గూర్చి మౌక్తికమణీహారంబు పాలించు నా
జనకక్ష్మాపతికన్య ముద్దరఘురాట్క్ష్మాపాలునిం బ్రోవుతన్.

మ. ఎలమిం దాఁ జనుదోయిఁ జేరుకొనఁగా ♦ నీమద్గళజ్ఞాటశై
వలినీపూర మటంచు హారములఁ బో♦వం దోయియు రుదారశ్రీగు
బ్బలు కీలం గబళించి యీర్ష్య చన సం♦భావించి సంతుష్టుఁడై
చలిగట్టల్లుఁ డొసంగు ముద్దళఘురి♦త్నాజానికైశ్వర్యముల్.

మ. తొగరాకందు కపోలమందు రతిఁ దో♦త్తోఁ జేర నీళానుగో
రు గదా యంచును దత్కపోలమున గో♦రుల్ వ్రదుకన్ వీనుగా
ద్విగుణం బౌతమి గోరుగ లొప్పదవు శ్రీ♦విన్ మించుశ్రీగౌరి పొ
ల్పుగ ముద్దళఘురిభూపచంద్రునికి గె♦ల్పుల్ గూర్చి మన్నించుతన్.

చ. తనదుహిరణ్యగర్భత సదా జగతిన్ మొయించు కైవడిన్
దనరుసువర్ణలీల వద♦నంబున డంబులు గుల్కఁ బల్కుమం
తనమున వాణి రాణి గను♦దక్కఁ బెనంగువిభుండు నిండుసొం
పున మన ముద్దళఘురివి♦భుం గరుణించి చిరాయు[1]వీయువుతన్.

చ. పలుదొలుకుల్కుపాలిఁ దగు♦బంగరుమేడను నాల్గువాకిళుల్
నిలిపినయట్లు లుండువిభు♦నిద్దపుమోములఁ బచ్చవిల్తు కీ
ర్తులబలె నాల్గురూపులను ♦ [2]బ్రోవయి కొల్వొనరించువాణి ము
ద్దళఘురిశౌరి కీవుత ద♦యన్ రసగుంభితవాగ్విజృంభణల్.

చ. ఒనపరి ముద్దుగుమ్మ తొడ♦నుండఁగ దత్పురుషాయితంబునన్
ముసురుకొను న్మెఱుంగుచను♦ముత్యపు సోనలమాడ్కిఁ జూడ్కి కిం
పెసఁగెడియందపుఁ బవముఖ♦బృందము చల్లుచు నుల్లసిల్లుమా
నిసిమదహారిప్రీఁకదొర ♦ నిండుదయం గృతికర్తఁ బ్రోవుతన్.

సీ. ముక్తలక్ష్మీకుచం♦బు గ్రహించురీతి నే
బాలుఁడర్కునిఁ బట్టి ♦ ప్రౌఢిఁ గాంచెఁ
దన కలంఘ్యం బేది ♦ యను భాతి నేమహా
బలశాలి పచరించి ♦ వనధి దాఁటె
విభునిప్రతాపంబు ♦ వెలయించుదారి నే
వీరుఁ డగ్గికి లంక ♦ విందుఁ జేసె

---

పాఠాంతరము. 1. వీవుతన్. పా. 2. ప్రోవయి.

సువిదరాగము[1] చేతి ♦ కొనఁగిన మాట్కి[2] నే
ఘనుఁ దేలికకు మణి ♦ కాన్క చేసె

తే. గీ. నతని ధృతిమంతు మతిమంతు ♦ నధికశాంతు
సమరదుర్దాంతవృత్తాంతు ♦ సారశౌర్య
వంతు ముద్దళరిక్షమా♦కాంతుఁ బ్రోవ
నెంతు నుతియింతు హనుమంతు ♦ నెలమిఁ గాంతు.

చ. పొలుపుగఁ బుట్టతేనెలు గు♦బుల్కొనుపల్కుల రామకీర్తనల్
సలిపినసత్కవి న్మధుర♦సామసురోక్తుల ధర్మపుత్రుని
ర్మలచరితంబు పాడిబద♦రస్థితిగా నొనరించుసత్కవిం
దలఁచెద గొరివీడియపు ♦ తావులకొప్పులఁ బల్కు సత్కవిన్.

మ. మును గిర్వాణమున నాంధ్రభారతమహాం♦భోరాశి నన్నయ్యలు వ్రల్
మునుఁగం దామస ముద్ధరించునగ నిం♦పుల్ నింపుసందర్భముల్
దనరంగా నొకకొందుతేపల ప్రబం♦ధశ్రేణి నిర్మించు స
న్మన నెఱ్ఱార్యుని దిక్కనాధ్వరిని హృ♦ద్యస్తోత్రః గీర్తించెదన్.

శా. సంఖ్యాతీతవిధావకీరితసుధా♦సాధారణస్వాదుతా
సంఖ్యావాదిచమత్క్రియోర్మిళవచ♦స్సందర్భణాప్లాదికిన్
సంఖ్యావత్త్వము చెల్లుఁగాక దొర గా♦సం బియ్యఁ దద్వేదనా
సంఖ్యాపూరకులై నవారలకుఁ ద♦త్సామర్థ్యముల్ చెల్లునే?

చ. తెనుఁ గని సంస్కృతం బని మ♦ది న్వివరింపక నీచవాక్యపుం
దునియల నోటికుండలను ♦ దొంతి యిడున్వగ డబ్బికబ్బముల్
పెనఁచి నరాధముల్ భ్రమయఁ♦ బేర్కొని ముష్కరులై నదుష్కవుల్
ఘను లగుసత్కవీశ్వరుల ♦ కైవడి రాజులపూజ కర్హులే?

మహాస్రగ్ధర

సదసచ్ఛబ్దావబోధుల్ ♦ సరసవిరచనా ♦ సాధుమేధాసనాథుల్
విదళద్దుర్వ్యక్తియూథుల్ ♦ వివిధకృతిమహా ♦ పీఠికానిర్మిగోధల్

పా. 1. సువిదరత్నము. 2. ఖాతి.

సదయుల్ సాధుల్ విబాధుల్ ♦ సభలను సుకవుల్ ♦ సత్కృతుల్ సేయువోఁగ
త్పదవిద్యాకోటికూట ♦ స్ఫుటిత కటుపద్యంబు ♦ హృద్యంబునౌనే?

సీ. పాశ్రితులతోఁ బాము ♦ పగిదిని పగ చాటి
తెలియకుండను తేలు ♦ వలెను మీటి
పెన ముక్కు జూసిన ♦ పసరంబువలెఁ దుళ్ళి
బంతికిరియను బెట్టు ♦ పడుచు మళ్ళి
కాకివై వడి నింపు ♦ గానికూఁతలు పెట్టి
మేఁకవలెను గన్ను ♦ మెక్కఁ బెట్టి
మాట దోఁచక కొంగ ♦ మాడ్కి ధ్యానము చేసి
యడవిమొకముదారి ♦ నాకురాసి

తే. గీ. తికమకలు చెంది మది వగా ♦ వకలు పొంది
వికలతను మూఁగయగ్గిక ♦ వెగటు గాఁగ
కాఁగతనమునఁ గవి నంచు ♦ రాయిడించు
కుకవినుడిగుంపులు మను గాఁత ♦ గోటియొంపులు.

కం. హృదయంబె పలక బలపము
చదు రగుమదియఖిలకు కర్చ ♦ సాగరాజికుఁ డా
కొదమనెలతాల్పు నైనక
విదితం బగు సుకవికవిత ♦ విద్వత్సభలన్.

చ. సకలము చల్లనౌ కులుకఁగి ♦ జక్కవపిట్టలు స్రుక్కువై వడిం
గుకవు లసూయచేఁ గుమిలి ♦ ఘూర్ణిలిరేని ప్రసన్న లాదు రా
సుకవులు మామకీనహృదు ♦ సూక్తికిఁ జెందొవవిందునింపుపొం
దిక నగుపందువెన్నెలల ♦ తేటకుఁ జొక్కు చకోరముల్వలెన్.

మ. కినియున్వా రనుచీకటున్ విరియ వా ♦ గ్దేవిముఖేందుమాదయం
బున నుష్పాంగెడినాఁడుచిత్త కలశాం ♦ భోరాశిపైఁ దేరుపా
లను నున్నోల్లువతేటపల్కులటు చా ♦ లఁగ బొల్చురత్నంబు లు
ర్విని శృంగారకృతుల్ మహీపతులు కూ ♦ ర్మినావనిఁ జేకోరాకో!

సీ. సరసత భువనంబు ♦ చల్లనై విలసిల్ల
సారస్వతస్ఫూర్తి ♦ సంఘటిల్ల
వనమయూరాధిక♦వాక్పుణి పొసంగ
రయనటద్ధారాతి♦శయ మెసంగఁ
బటుతరోదితకవం♦బంబులు నవలోత్త
వెలఁగుపడఁగనై న♦మెఱుఁగు హత్త
సౌహృదకవిరాజ♦సంఘంబు హర్షింపఁ
గూలంకషాభోగ♦లీల మించ

తే. గీ. నమృతవర్షంబు గురిసిన♦యయ్యు ఘనత
వెలయఁగా. గీర్తికందళ♦ములు చెలంగఁ
బ్రకృతి యంతయుఁ దనియంగ ♦ వికృతి లేని
సుకృతి నొనరించువాఁ డార ♦ సుకృతి జగతి.

వ. అని యిష్టదేవతానందనంబును సుకవిజనాభినందనంబును గుకవి నిందనంబునుం గావించి యే నభంగురశృంగారరసతరంగిత వచనరచనానుబంధం బగు నొక్క ప్రబంధంబు నిర్మించ నెంచి యున్న సమయంబున:

కం. లక్షణలక్షితకమలా
పేక్షణపుంబాణపుంఖ♦విభవోన్మేషా
నుక్షణతటివిభ్రమతి నై
దక్షిణసుపురంబు ♦ తనరు ధరిత్రిన్.

శా. ఆపీట న్విధుకాంతసంతతి సము♦ద్యద్భిక్మసాలాంతరా
భావిఖ్యాతవిదూరజాతమయకు♦డ్యప్రాంగణాధ్యాసిత
క్ష్మావజ్రోపలవేదికాగ్రరుచిమ♦చ్చకాశ్వవేశ్మాంశురే
ఖావల్గద్విజాతరంగమణిరం♦గత్తుంగ సౌధంబునన్.

మ. జనులం జల్లనిచూపులం దనుపుచున్ ♦ శంపాలతాంగుల్ నయం
బున వేవేల్ తనచెంతఁ జేరి యుడిగం♦బుల్ సేయ నంతంతకున్
ఘనతన్ దిక్కులరాజు లెల్లఁ బొగడం ♦ గర్ణాటరాజ్యేందిరం
గనుపన్నన్ వరియించె ముద్దుఘురి♦క్ష్మాజాని రంజిల్లుచున్.

ఉ. అంతిపురంబునం దగుసహా•సృనిజాకృతిభావచిత్రలీ
లాంతరకైతవంబున మృ•గాక్షుల కందఱ కన్నిరూపులై
యెంతయు ముద్దులఖ్ఖ రిన•రేశ్వరుఁడేలుఁ బదాఱువేలసీ
మంతినుల న్నిరంతరము • మన్నన సేయు మురారికై వడిన్.

కం. ఈకీల ముద్దుగుమ్మల
నేలుచు మదిఁ బ్రమ చెలంగ • శృంగారాబ్ధిం
దేలుచు మహిాషీజనముల
లాలింపుచు స్మరకళావి•లాసము మెఱయన్.

సీ. తనుపుగా నొకవేళఁ • గనకాంగి యొక్కతె
శుభలీలఁ బదముల • నభినయింప
పనుపుగా నొకవేళ • ననఁబోడి యొక్కతె
వీణానినాదంబు • వినికిసేయ
తనుపుగా నొకవేళఁ • దరళేక్షణ యొకర్తు
పంతుమూర్పుపాట•వింత చూపఁ
నినుపుగా నొకవేళ • నీలవేణి యొకర్తు
హితవైన శృంగార•కృతులు చదువఁ
తే. గీ. బనుపుగా నొక్కపంకజ•పత్రనేత్ర
మువిదతులరాయబారంపు•మాట లాడ
జనులు కలియుగగోపాలుఁ • డనఁగ వెలసె
సరసగుణహారి ముద్దులఖ్ఖ రిమురారి.

సీ. ఏవేళ నడిగిన • హేమరాశముగ నిచ్చు
నేపాటికవి యైన • నెలమి మెచ్చు
గుణ మింత గలిగిన • గణుతించి జను నేలుఁ
దప్పు లన్నియుఁ దాళి • తలఁచు మేలు
నాయంబుఁ గూర్చువో • నాయంబు పచరించు
నాశ్రితావళిఁ జాల • నాదరించు

---

పా. 1. పత్రినయన.

విరసించునట్టిభూ ♦ వరు నైన ననిఁ జెందు
సాధుగోష్ఠిని బ్రొద్దు ♦ జరపుచుండు

తే. గీ. నిలను గావునఁ జక్రివ ♦ ర్తులును రాజు
లార్గురు పదార్గురును గాని ♦ యన్యు లెనయ
యనఁగ సుగుణసమష్టిచే ♦ నతిశయిల్లు
సరససులభుండు ముద్దుల ♦ ళ్ఘరివిభుండు.

సీ. తనదానజలలీల ♦ తటవతీతతిమహాం
బుధులకు నెడ లేని ♦ పొందు గాఁగ
తనరమ్యతరయశో ♦ ధవళిమ యామినీ
వరునిబింబమునకు ♦ మొఱఁగు గాఁగ
తనతేజ మిలఁ జుట్టు ♦ కొనుగట్టు పెన్నెఱుల్
మొగ్గరంబుల విచ్చు ♦ మొగ్గ గాఁగ
తనప్రతిభారూఢి ♦ వనజసంభవశేష
వాల్మీకులకు మేలు ♦ బంతి గాఁగ

తే. గీ. తనమనోవర్తనము నెప్ప ♦ ధరణికన్య
కామణీదాశరథపాద ♦ కమలబంభ్ర
మద్భ్రమరలీల నలు వొంద ♦ మహిని వెలసె
నరిజనవిదారి ముద్దుల ♦ ళ్ఘరిమురారి.

వ. వెండియు నఖండపాండిత్యమండితఖండపరశుకుండలకుండలి కులాఖండలదిఙ్మండల వేదండపాండురకీటికమఠవిభుశుభాపాదనప్రచండబల సముద్దండదోర్దండ కందుకితతాండవజర్ఝరమాకుచకరండ హిండమాననవ నవప్రవాళమణికాండసమరపరమండలాధిప తిమిరఖండనశౌండమహోచ్చండ చండకిరణమండలుండును, పరమర్దనగతమార్దవహృదయ దుర్దమ మదకర్దమ సమ్మర్ద విస్ఫురసమరహార్దవినర్దమాన విరోధిశిరోధికా నిర్దళనదుర్దాంత సార్థకవఘణోపమ పరుషతరకరఖురట్టఘట్టన తృట్యమానధరణి చత్వర తదాత్వవిస్ఫృత్వర చక్రికులశక్రిఫణాక్రాంత నిర్వక్రిమణిచూర్ణతాసవర్ణతా లబ్ధవర్ణ సామంత మహీకాంతగళ పరిగళదనర్గళశోణితప్రోణితానిపానసావ

ధానసముత్తాలకగతాళ భూత[1] వేతాలమండలుండును, సంవర్తసమయప్రవర్తమాన నర్తనపౌష్కల్యపుష్కలావర్తఘుర్ఘురనిర్ఘోషానుసంధానసమింధానమహానాసశిఖరి సంధితకలశసింధు బంధురగగన జంఘాలతా విశృంఖల తరంగసంఘ సంఘటితఘుమఘుమారవ గౌరవహ్రాతిభైరవదుందుభి బృంహకంఠధ్వనినాద మేదురిత చక్రవాళాంతరాళుండును, కరాళకరతాళ ధారాధారాధారాళనీరపూర కోరకితయశఃకుసుమజాలకరవాలుండును, హ్రాద్యానవద్యతనగరంత కాంతశశికాంత సౌధాంతరహర్మ్యశ విహరమాణ విదేహకన్య[illegible]మణీనిస్తులస్తన కనకకలశకనదకలంక కుంకుమ పంక సంకలన చంకసన్నకరాంకసూచితమకరాంకవిజయాంకనో న్నిద్రరామభద్రపూజాజాయమాన విశ్వవిశ్వంభరాభరణ విశ్రుతశాశ్వతైశ్వర్యధుర్యుండును, తుంగవేణీభుజంగశిఖరిపుంగవశృంగదభంగ సాంగత్యసంభావిత గాంభీర్యధైర్యుండును, వినిద్రదరప్రభావ ప్రథమాన ప్రయత్నమడిధిక దశమహారాజ ప్రాదేశసాదేశనిస్తుల తులాపురుషాదిక దైనందినమహాదాన మహిమాపహసితకోమారిగురుకల్పతరుకామధేనుకమలవైరికర్ణ కనకగిరి కలశజలనిధానుండును, కరుణావిశేష పో... సాత్మ్యస్వతంత్ర స్వతంత్రతానిధానమహాప్రధానుండును, పుష్కలజయా విస్ఫురణ దుష్కర సమరముష్కరతురుష్కధానుష్కధనంజయ నిష్కాసనోద్దీపిత ప్రతాపనారాయణుండును, ప్రతిదినకృత భారతభాగవతరామాయణ పారాయణుండును, అక్షీణపక్ష[2] కులకోలాహల హూణభామినీభీషణవేష విద్వేషిణమహీపకపాలంకషకోపరసప్రతికోటికీయ కోటీరకోటీచిరత్నరత్నవిసరనవకిసలయాస్తరణకలిత సంచరణకోమలచరణుండును, పంచతిరువళ్ళిరాజసప్తాంగహారణుండును, ఖండేందుధరా చండకరణమండల శరపాండురకాండజ కందర్పకాండ కలశకాండాది డిండీరగరుడతుండపులోమ ఖండి శుండాలశరత్కాండగౌడవచండమండలప్రకాండవేదండరిపుదండనాఖండసూర్తికీర్తి పరికర్పూరపూరిత కనకకరండాయమాన బ్రహ్మాండుండును, నారుహాన్నిబ్బరగండుండును, మదవదళలభువనజంపతీ ధృతిలుంఠనసంపద్యమానమానస సంపదుదంచితవంచనాప్రపంచిత పంచశర పంచశరీ వికర్షణ వర్షిత మకరందవర్ష బృందీసందేహ

పా. 1. శేతాళ. పా. 2. రక్షక్ష్వేళా.

దోత్కర్ష వేల్లితపల్లవాధరా కలిత కనక వల్లీకావానుండును, మాఖిరి
మాణవీరాయమర్మభేదనుండును, కోపప్రసాదచటులకుటిలాలోకననటిత
కుశేశయవితానసంరంభ కుంభస్తనీమోహనకుసుమసాయ కుండును,
కుంతూరి దుర్గనాయకుండును, తత్రాదృశ శృంగారస్ఫూర్తిచమత్కృతితరంగిత
సుకవిహృదయకంజరంజనాను[1]క్షణవీక్షిత కటాక్షుండును, దక్షిణ సింహాస
నాధ్యక్షుండును, తిరుమలనృపాల కలశాంభోధి పూర్ణిమాశశాంకుండును,
ధరణీవరాహాంకుండును, కల్యాణ పరంపరోదారకుమార ముప్పసీరనృప
కల్పతరు తపః ఫలంబును, కమనీయగుణాతరంగ లింగాంబికాగర్భశుక్తి
ముక్తాఫలంబును, మోహనశరవిలాసబాలికాజనలీలాలోలుండును నగు
ముప్పభూరి భూపాలుండు నీరజబాంధవుం డుదయింప నొక్కనాఁడు నిత్య
కృత్యంబులు నిర్వర్తించి బలువగు మానికపుఁ దొవలుదొడిగి చెలువు
మీఱఁ గొల్వుసింగారంబు చేసికొని యవితర సాధారణరీతిం గ్రందుకొన
మందమందగతుల సౌధంబు డిగ్గి తనడగ్గఱం గిక్కిఱిసి యిరుపక్క యలం
డెక్కలంబిక్కటిల్లు చక్కరవిల్తుచిక్కటాల్లవలె నెక్కువ పొగరుమేని
టెక్కు లెక్కువ తక్కువ లేని చక్కని వయసునిక్కువగ జక్కవగుబ్బ
లాండ్లు కర్పూరకస్తూరికా సంకుమద కుంకుమపంక కమల కర్పూరఫుల్ల
మల్లికాసముల్లసిత సౌరభంబులు గమ్మనంగ్రమ్మకొని కనకముకురకరండ
కలాచికా కనకాలుకా కౌక్షేయకోపశోభితకరారవిందలై వెంబడింపఁ
గొన్ని యంతస్తులు దాఁటి [2]యట చన నంగనల సందడి మగుడం గనుం
గొని తదనంతరంబునఁ జెంతఁ జేరి కొందఱుమన్నీలు మునుమున్నుగా
నూడిగంబులు ఘటియింప నెన లేని రాజసంబు నటింప నిగనిగ నిగుడు
తొగరాజుగతి సొగసుడంబు లంబుజరిపు దృషదున్మేషనితంబాడంబరంబు
విడంబింప నింపునింపుప్రోఁగెంపుగుంపు చెక్కడంపువగం దురంగలించు
కట్టాణిముత్తియపుగట్టి చప్పరపు ముంగిటిరంగు లర్ఘ్యమమణి పర్యంత
గిరిదర్యంతధరానటితకునటికాపటలోత్కట శోణిమగరిమ రాణింప గరగరిక
దొరయు కట్టుడాలు జాలుకొను నీలంపుకంబంబులం గ్రిందుకొను చెందొవ
జిగిపొగరునిగుడఁ బగడపుబోదెల గుమింబాదుకొను నునుపుతత్త్రప్రదేశ

పా. 1. క్షణపక్షపాతకటాక్షుండును. పా. 2. యచట.

నిరూఢవిటపి విటపాశాఖాశయమాన శాల వప్రివాళజాలలీలం దెలుప వేడుకల నీను నై దూర్వాంపుపొడి జిగిబెడగగు నిడుదపాడి పనినడరుకొడిగె తుదిమొద లుకడాని గంటలపలుకునిగుడ నికటతట మృగయావిధానసావధాన కిరాత వరారోహాకరాకృష్ట ధనుష్టంకారంబుల యలంకారంబు నెరప, నారాడ నెనంగు నింగిలికపు గచ్చు హెచ్చుగోడల నీడలరంగు మీాఱు నేకరంగిపట్టు మేల్కట్టుబిగిలింత నిరంతర విహారమార్గారావణ కరవిఘూత కటకతట భాసమాన కాసార సారస పరాగభరంబులు తిరంబు గొలుపం గదుపులు గొని యుదుటవన్నెల ముంగిటనుండు వేదండమండలంబు లున్నతశృంగ రంగత్తరంగితసంచార నీరదబృందంబుల యందంబుజూప నొయ్య నొయ్యన మవ్వంపు లాగడంపు సోరణగంప్లగొంజ్లి పలుపు జాలవాకిలుబొమ్మల యొరపు కుసుమశరసాంపరాయ సంపద్యమాన చాతుర్యధుర్యకిన్నర దంపతీ విలాసంబులు మెఱయింప నుదయధరాధరంబు విధంబున దంబు మీాఱి మెఱయు నమరావతి గతి నాకలిత సుమనస్సంతానసురభియు, రామవన ప్రస్థానంబుగతి చిత్రకూట స్థిత్యభిరామంబును, చంద్రమండలంబు బాగున సుధాధవళంబును, రావణ సైన్యంబు వడువున నతికాయమా నాశ్రయంబును. సుగ్రీవ సమ్ముఖంబుడంబున నవారిత సంచార మారుత కిశోర నీలగవాక్షకుముదాభిరామంబును, సుధర్మాస్థానంబు చందంబున రంభావిరాజమానంబును, శుక్రసదనంబు[1]నేవ నగరువాసనావాసితంబును, నగుకొలువు కూటంబున బాలసూర్యునింబలెం జేరి తనకు మేలు గోరు ధరణీసురుల మంగళాశీర్వాదంబులును, తనకుం బరాకుదెలిపి బరాబరి సేయ సంభ్రమించు కంచుకి వ్యూహంబుల సాహోనినాదంబును, తన ముఖసందర్శనంబునకు సంపడించు సామంత ధరణీకాంతుల మిథస్సంఘృష్ట మణిమకుట విటంక టంకారంబులును, తనగెలుపుపద్యంబు లుగ్గడించు వందిబృందంబుల విజయహాంకారంబులును, తన చరణారవింద వందనము లకు ముందుముందుగా సాగిలి దండంబిడు [2]గిరుఫ్లులున్న చెండి మన్ని కొమాళ్ళ కలకలంబులును, తన నవ్వుపువ్వుసోనలకు మవ్వంబు నివ్వటిల్లం గొలువు మ్రొక్కులు ఘటించు వారవనితల కిలకిలల యులబలంబును, తన

పా. 1. వగను. పా. 2. గిరుఫులును.

సమ్ముఖమ్ముఁ జేరఁ గ్రమ్మ కలభమ్ములకాంచన ఘంటికాఘణఘణమ్ములును, తనయెదుట వేషధారులై వచ్చు శైలూషుల వినర్తమాన మర్దలతాళసముత్తాల ధణంధణంబులును గ్రందుకొన నందు.

మ. హితులున్ రాజులమాత్యులాడిగములుం ♦ హేంజీబులార్యుల్ పురో
హితులున్ జ్యౌతిషికుల్ నటుల్ భటులు సా♦హిత్యప్రవీణుల్ కవుల్
మతిమంతుల్ జయకాళ్లు పాఠకజనుల్ ♦ మాష్టీలు వజీరులు నూ
ర్జితభక్తిం గొలువన్ మహావిభవముల్ ♦ చెల్వొంద నందంబుగాన్.

సీ. నునునరిగెనకసీ♦పని సూరెపుటపు మి
న్నలు గ్రమ్ముసమ్మా[illegible]♦గలను జిమ్మ
చే నున్ననున్నని ♦ చికిలిస్పెఁడి మొలామ
చికటారి నుడిగమ్ము ♦ చేతి కొసఁగి
మ్రోలఁ జిత్రరుపటం♦బునఁ బొల్చు శ్రీరాము
చరణాబ్జములకు నం♦జలి ఘటించి
బాలీసుబటువులు ♦ పక్కదిగ్లను మేలు
కట్టుపూజల్లులఁ ♦ గలయఁ జూచి

తే. గీ. స్తోమముగ పైఁడిపావడల్ ♦ చామరమ్ము
లాడ జిగివింపు రతనంపు ♦ టరిదికట్టు
గద్దెపై నంత ముద్దుల♦ళ్ఘిరి విభుండు
నిండుకొలువుండెఁ గన్నుల♦పండు వమర.

శా. ఆరీతిన్ సభ ముద్దులళ్ఘిరిధరా♦ధ్యక్షుండు కొల్వుండి తా
హేరాళంబుగ నయ్యెడన్ నమచు సా♦హిత్యప్రసంగంబు గం
భీరప్రౌఢిమ మించ నన్ బిలిచి నె♦మ్మిం బల్కె వీణాకన
ద్గౌరీపాణి సువర్ణ కంకణఝణ♦త్కారానుబంధోక్తులన్.

చ. అనువుగ రుక్మిణీపరిణ♦యంబును మున్ హవణించియార్య లా
వనఁ దనియించినావు మము ♦ నప్రతిమంబుగ నవ్యకావ్యమిం
పున రచియించుమీ సొగసు ♦ పోఁడిమి మీఱఁగ సత్యభామసాం
త్వన మనఁ గప్పురంపుచలు♦వన్ గెలువన్ దరుకామసత్కవీ.

కం. కాకులవలె నింటింటను
కాకవు లున్నారు హంస ♦ కైవడి భువిలో
శ్రీకామ నీకె తగురా!
యేకడ నుడి పాలు నీరు ♦ నేర్పఱుపంగన్.

కం. ఏభాష నైనఁ గృతిపతి
శోభనములఁ జెందు నీదు ♦ సూక్తులవలనన్
సౌభాగ్య మసదృశము గా
రీభవకరుణానివేశ ♦ శ్రీకామేశా.

వ. అనిన విని తదాజ్ఞానుమతి నే నంగీకరించిన నతండు సబహుమానంబుగాఁ గర్పూరతాంబూల కనక చేల కమనీయ రత్నాభరణస్తోమ గ్రామప్రదానంబుల నానందంబు డెందంబునఁ గ్రందుకొన నొసరించిన:

తే. గీ. తనదు దక్షిణ నాయక ♦ త్వమున కుచిత
ముగను ముద్దళఘురిశౌరి ♦ ముదము మీఱ
నాటి రుక్మిణీపరిణయం ♦ బందుకతనఁ
దా నిపుడు సత్యభామసాం ♦ త్వనముఁ గోరె.

కం. అదితికిబలె శ్రుతిభూషణ
మొదవింతు బుధాళి కనుచు ♦ నొగి శ్రీపతి నె
మ్మది ముద్దళఘురి యనఁ దగి
సదయత మఱి సత్యభామ ♦ సాంత్వన మెంచన్.

వ. అనుచు ననుచువేడుక నతని యింగితం బెఱింగి సంగరాంగణాభంగుర నిజ విజయరమా సౌమాంగల్యసంధాయకు, నపారకృపారస పోషిత కవిగాయకు, నాశ్రిత జనాభిమతార్థదాయకు, ముగ్ధవధూకుసుమసాయకు, ముద్దళఘురిభూనాయకుఁ, గృతినాయకుం జేసి నే నేర్చినవగ వడ దీర్చి తేర్చినవన్నెటిసాటి తేటమాటలుచేర్చి కుపితనాయికా సాంత్వన పర గోపాలకానల్పకల్పమంజరీసంజరీజృంభమాణసౌరభమ్ము విధమ్మున దినవిగమ సమయ [1]...నిన[2]...వీషుజలపటలలోలుత[3]...ద్విధ్వంసుర పరిగళదమృత

...1, 2, 3. గ్రంథపాతములు.

బిందుబృందంబునందంబునఁ గంజభవహ్లాదయ రంజన పురుషాయిత పరవశ సరస్వతీ కుచహస్త విసృస్త నిస్తుల జాతిసుమరీతి శృంగారరసతరంగితాంతరంగ కనదనంగ కర్ణరసాయన రతికృత రతికూజితంబు నోజ నే రచియించు సత్య భామాసాంత్వనం బనుకృతి నతి చమత్కృతిం బెరయు సరసవచో మాల్యంబు సాఫల్యంబు నందఁ జందు మకరందపూరం బగుతదీయ వంశావతారం బభివర్ణించెద.

సీ. వనజసంభవముఖ♦వధ్బవామరకోటి
కోటీరమణులలోఁ ♦ బోటి మీటి
జహ్నుకన్యామణి ♦ సలిలనిర్ఝరజాత
జాతరూపాంభోజ ♦ సమితిఁ గేరి
నీలాభిధానవ ♦ద్బాలామణీహారి
హారిద్రవరదీప్తి ♦ యనఁగఁ జీటి
బ్రహ్మర్షిపూజన ♦ పరిమళపారమ్య
రమ్యసౌగంధిక ♦ ప్రభలఁ జేరి

తే. గీ. రహిఁ జెలఁగుసారరుచి పూర♦రత్నహార
సహితవక్షోజ కాఠిన్య♦సమానగణ్య
నవనవారుణ్యనటి తాబ్ధి♦నందనార
సారసంబు ముకుందాంఘ్రి ♦ సారసంబు.

తే. గీ. దాన నొకజాతి జనియించి ♦ తనర నాత్మ
వాసనలు ఘుమ్మమన శుద్ధ♦భావ మమర
నందుఁ దాఁ జెంది యుదయంబు ♦ నందె జగతి
ధీప్రభోగప్రభుండు నా♦గ ప్రభుండు.

కం. అనాగవిభుఁడు గంగా
స్నానము గావించి విశ్వ♦నాథునికృప మెం
తేని తగ విశ్వనాథ
జ్ఞానాథునిఁ గాంచె వేదు♦కలు నలు వొందన్.

ఉ. నాగవిభుండు పాదభజ♦నంబుననే కడు ధన్యుఁ డంచునో
బాగుగ విశ్వనాథుఁడు కృ♦పాపరిపూర్ణ ఫలం బొసంగె నా
రా గణియించుచుండె నుద♦రంబునఁ దోఁచెను తోఁచి క్రమ్మరన్
దాఁ గటకస్థితిం దనరె♦ధాత్రి శివోన్నతి చిత్ర మెన్నఁగన్.

కం. ఆవిశ్వనాథుఁ డార్యో
ద్భావిత చారిత్రుఁ డగుచు ♦ ధనదసుహృత్తా
సేవధియై హితసుధియై
జై వాత్మకమాళి యనఁగ ♦ జగతిఁ జెలఁగెన్.

మ. ప్రబలారాతి కుమారకోటి ప్రతిబిం♦బంబుల్ నిజచ్ఛాయతో
నిబిడంబై కనుపట్ట సంగరమహిన్ ♦ శ్రీవిశ్వనాథేంద్ర బా
హు బలప్రోద్ధత ఖడ్గపుత్రితళుకై ♦ యొప్పారెఁ బ్రాయంబునన్
సొబగా నచ్చరనిచ్చ పెండ్లికొడుకున్ ♦ జూలాలి చందంబునన్.

సీ. కామునిరూపు భం♦గముఁ జెందె నెవ్వాని
కడకంటిచూపునఁ ♦ గ్రిందుకొనఁగ
వంశంబు దెరలెను ♦ వసుధలో నెవ్వాని
చండరసోన్నతి ♦ మెండుకొనఁగ
దండ భృద్వృత్తంబు ♦ తరిదుప్రెంగె నెవ్వాని
పటుపదాతి స్ఫూర్తి ♦ పరిఢవిల్ల
అవనికుంతలము చి♦క్కు వడియె నెవ్వాని
చేకత్తి యొక యింత ♦ చిందు ద్రొక్క

తే. గీ. వతఁడు భువి రాజశేఖరుం ♦ డఖిలబుధజ
నాభిమతదాత యీశ్వరుం ♦ డమితభూతి
ఘనుఁడును నయజ్ఞ రక్షకుఁ ♦ డనఁగ బళిరె
తనరునాగయ విశ్వనా♦థప్రభుండు.

ఉ. సాగర మెంతయుఁ బల ర♦జంబున నింకు శిరంబు లూచుఁ బ్రా
గ్భాగివరుండు ఘోటఖుర♦కోటివిఘట్టన దుందుభిధ్వనిన్

వేగ వియత్తలం బదరి • విచ్చు నటన్న జగత్త్రియంబునన్
నాగయవిశ్వనాథ నర•నాథుని శౌర్య మవార్య మెన్నఁగన్.

ఉ. డెబ్బదిరెండుగురాజులఁ గ•డింది తనంబునఁ గొట్టి పోరిలో
డెబ్బదిరెండుగెల్పులు వ•డిం గయికొంచు సమగ్రకీర్తి చే
నుబ్బుచు విశ్వనాథవసు•ధోత్పలబాంధవుఁ డొప్పు నారుహ
న్నిబ్బరగండఁ డంచుఁ దను • నిద్ధర నందఱు • సన్నుతింపఁగన్.

శా. విద్యారణ్య తపోవిపాకవిభవా•విర్భూత సింహాసన
ప్రోద్యద్దుర్గను భార్గవీ విజయ లీ•లోన్నిద్ర భద్రార్చనా
హృద్యప్రక్రియ నింటఁ జేర్చుకరణిన్ • శ్రీవిశ్వనాథుండు చం
చద్యోగంబునఁ జెందెఁ దత్కరుణ హెం•చ్చన్ శాశ్వతైశ్వర్యముల్.

కం. ఆవిశ్వనాథనృపతికి
శ్రీవీరాజమకుఁ బెద•కృష్ణనృపాలుం
డావిర్భవించెఁ ద్రిభువన
కోవిద సంస్తూయమాన • గుణమణిఖనియై.

మ. జగతిన్ నాగయ విశ్వనాథుపెద కృ•ష్ణక్షోణి పాలాసిప
న్నగదష్టాహిత ముష్టమోహను లమృతాం•ధఃప్రక్రియన్ మించి వా
సిగ నస్వప్నతఁ గాంచి యంత విగత•క్షేత్రాతిరేకాత్ములై
ఖగవాహప్రతిరూను లై రి యిల స్వ•ర్గంబందుఁ జిత్రంబుగన్.

సీ. ధర భోజజాతోర్జి•త కళాస్థితి వహించి
లలిత సత్యాలాప•కలన గాంచి
బుధభవోన్మేష • బుధకీర్తిఁ జెలు వొంది
భద్రాతిశయ లీలఁ • బ్రాపుఁ జెంది
యలరుసుదంతాల•య వసతి రాణించి
సూర్యాత్మభూమోద•చర్య నించి
మిత్రవిందాధిక • మృదు భావమునఁ బొంగి
లక్షణోదార లీ•లలఁ జెలంగి

తే. గీ. యరుదుమీఱంగ నరిదియై ♦ యగదుఁ డగుచు
మఱియు నబలానురంజన♦మహిమఁ జెంది
యెంతయుఁ జెలంగె నభినవ♦కృష్ణుఁ డనఁగ
విశ్వనాథేంద్రు పెదకృష్ణ ♦ విభువరుండు.

ఉ. ఆపెదకృష్ణభూవర కు♦లాగ్రణికిన్ జనియించె సంతత
ప్రార్థితకీర్తిహారి సుకృ♦తానుగతైక సతీవిహారి త
ద్భూపవతంసముఖ్య పరి♦పోషణతోషితశేషభోగి వా
ణీపతి పెద్ద తిరధర♦ణీపతి కోపతిరస్కృతారియై.

సీ. ఆహవధరణియం ♦ దతిరౌద్రిగతి మించి
ఎకారిశ్రేణి ని♦ష్ఠళనఁ జేసి
వితతజడిమఁ దాల్చు♦విద్వేషి రాజము
దలము పదాతిఘు♦ట్టనలఁ జదిపి
పటుసుమనోదంతాను ♦ బంధంబు వీడంగ
నను హృదినానసా♦హాని యొనర్చి
చిత్రింబుగను వినా♦సిక గుణాధిపము దోఁప
[1]విమతవివాసిని ♦ విస్తరించి

తే. గీ. నితతవిశిఖాళి కాలికా♦విలసనంబు
బహుళకరావాప్తి యనఁ జాలఁ ♦ బరిఢవిల్లఁ
గీర్తి చేకొనె [2]నుద్దండ♦మూర్తి కృష్ణ
విభునితిరుండు రెండవ ♦ వీరుఁ డనఁగ.

మ. అదనన్ శ్రీపెదవీరశౌరియరియా♦హాకారలోనుండ నిం
దువయ న్మోహపురాణి తా సవతి బో♦టుల్ చూడ నీకొంకు లా
పెదవీరాతనయించు వా రని రతా♦ప్తిన్ దృష్టి చేకూర్చె నా
నదరెన్ గుండియ వాని కవ్విభుని పే♦రై యానుడే తోఁచెనో?

కం. ఆవీరవిభుఁడు తిరుమల
దేవీరమణీయలీలఁ ♦ దేలుచు విశ్వో

---

పా. 1. విమతవాణీస్మృతి. పా. 2. నసస్పృశమూర్తి.

శ్రీవిభుఁ గుమార కృష్ణ
క్ష్మావరుఁ గస్తూరిరంగ ♦ జనపతిఁ గాంచెన్.

ఉ. విస్సధరావరుండు పెద♦వీరనృపాలతనూభవుండు తే
జస్సమదత్వరాతిశయ♦శాంత పయోజభవాండ మండలాం
తస్సదృఢాంధకారత గ♦నంబడ వేదపుగట్టి వెన్నుపై
నుస్సు రటంచు వైరినృపు ♦ లుండక మ్రొక్కిరి లుప్తగర్వులై.

శా. ఆవిస్సక్షితి పాలవంశమణిబా♦హాలక్ష్మ్యకౌక్షేయకా
గ్రావిర్భూత సమగ్రకంపమున నా♦హావే డిడాల్గుండె యొం
తేవేగంబునఁ జంచలించె మతిదా♦నిన్ సర్వగీర్వాణ కాం
తావక్షోరుహహారముల్ కనుఁ దనం♦తన్ గంప మందెన్ రహిన్.

ఉ. ఆనరనాథుతమ్ముఁడు ర♦ణాంగణతుంగతురంగ ధాటికా
నూనఖురానవద్యదళ♦నోద్యదతిద్యుపరాగ యోగస
ద్యోనిబిడై కకర్దమ మ♦హోదధి యల్లకుమారకృష్ణభూ
జాని చెలంగె నౌ నిజభు♦జానిభృతప్రబలప్రతాపుఁడై.

మ. సమరప్రాంగణసీమ వీరవిభుకృ♦ష్ణక్ష్మాపబాహాగ్రదు
ర్దమకౌక్షేయక విక్షతారి నృప వ♦త్సస్ఫారరక్తావివి
క్తమహీకర్దమయుక్తి భిన్నకరి♦ముక్తారేఖకల్ కీర్తిస
స్యము దోఁపన్ వెదఁబెట్టు కైవడిని ♦ నిచ్చల్ పొల్చె శుభ్రాకృతిన్.

సీ. దురుసుమన్నీల కీ♦ర్తుల పేరిటివెడంద
గట్టుమీఁగడచట్లు ♦ గొట్టికొట్టి
పెరరాచపూప గు♦బ్బెతలపేరింటిప్రో
యాంధ్రమానము కొల్ల ♦ లాడియాడి
పరమహీపతి జయేం♦దిర చంటి పేరింటి
ధరణీధరము కేలఁ ♦ దాల్చి తాల్చి
దూబరిపెనుదాయ♦నైబు పేరిటిగట్టు
చిల్వమో [1]మదుముక ♦ చీల్చిచీల్చి

పా. 1. మెముకల.

తే. గీ. పంపులకు రానిదౌర ప్రతా♦పంపుకెంపు
మెఱుఁగు పేరిట కార్చిచ్చు ♦ మిగ్రింగిమిగ్రింగి
వెలసె నీరీతిఁ గృష్ణలీ♦లలఁ జెలంగి
యుద్ధజయహారి వీరయ♦కృష్ణశౌరి.

చ. అలరుకుమారకృష్ణ మహి♦పానుజుఁ డాహవసవ్యసాచి య
త్యలఘు యశోవిశోభి హరి♦దంతరసంగమసాచిమర్ద లి
ర్దళనఘన ప్రతాపుఁడు వ♦దాన్యకులాగ్రణి సజ్జనావనా
కలితగుణాలవాలుఁ డగు ♦ కస్తురి రంగనృపాలుఁ డిమ్మహిన్.

కం. అవిన్న భూపతివలన
నావిర్భావంబుఁ జెంది ♦ యఖిలప్రభుసం
భావిత నిజవిజయ ప్ర
స్తావుఁడు శ్రీ ముద్దుకృష్ణ ♦ జనపతి వెలసెన్.

సీ. జన్మోర్వి విమతకుం♦జర తాడన మొనర్చి
యసమాన బలసహా♦యతఁ దనర్చి
రిపువత్సకంఠని♦చ్ఛేదం బమర గిట్టి
పరభోగిశీర్షముల్ ♦ పగుల మెట్టి
యహితోగ్రసేనోద్భ♦వాగ్రూతిఁ గుదియించి
స్ఫుటయశోదానంద ♦ ఘటన గాంచి
తనర మందారాహ్వ♦తిని చాలనుప్పొంగి
ప్రబల సత్యాలాప♦రస [1]మెఱింగి

తే. గీ. చక్రధర శృంగవద్మాలి♦శయము మీఱ
శిష్టజనరక్షణము దుష్ట♦శిక్షణంబు
నతిశయిల నవ్యగోపాలుఁ ♦ డనఁగ వెలసె
విన్నవిభు ముద్దుకృష్ణ భూ♦విభువరుండు.

చ. నలువుగ ముద్దుకృష్ణ నర♦నాథశిఖామణి గాంచె వేడ్కతో
నిలవయి చంద్రసూర్యు లుద♦యించిరొకో యని లోకు లెన్న ని

పా. 1. మెసంగి.

శ్చలగతి ముద్దువీరనృప • చంద్రుని శాశ్వతకీర్తిసాంద్రుని
ర్మలతరధీరతావిజిత • మందరు నిర్మలభూపురందరున్.

కం. ఆముద్దువీరనరపతి
భూమండల మేలెఁ గమఠ • భుజగవిభు కిరి
గ్రామణ్యష్టదిశాకరి
సామాజిక [1]సార్వభౌమ • సారోన్నతుఁడై.

సీ. జాతిమాలిన యవ్వ • సంతుండు వివరింప
సాటియే సౌందర్య • సారమునను
రీతిమాలిన యల్ల • జాతరూపనగంబు
సాటియే యనుపమ • స్థైర్యమునను
నడకమాలిన యల్ల • నందన వనశాఖి
సాటియే నిర్నిద్ర • చారుకీర్తి
జెలివిమాలినయట్టి • [2]తోలుకరి క్రొమ్మొగుల్
సాటియే సతతవి • శ్రాణనమునను
తే. గీ. ననుచుఁ దెను జను లందఱు • నభినుతింపఁ
దనరె దుర్దాంత సామంత • ధరణికాంత
సంతమసశాంతి పటుధామ • చండధామ
విదితజయసారి శ్రీ ముద్దు • వీరశౌరి.

చ. అనిశయి వచ్చి కోత్రధరస • మాలినడాలున నేలుశాత్రవా
ననములు పద్మముల్ దనరు • నవ్యకిరీటమణుల్ పరాగముల్
గొనబుగ వెల్వడం దనదు • కోటిమరందరసంబు ముద్దుకృ
ష్ణనృపతిముద్దువీరనర • నాథుని ఖడ్గమిళింద శేఖరున్.

చ. అలనరనాథుతమ్ముఁ డఖ • లారిభయంకరచారుమూర్తి య
త్యలఘుశుభానువర్తి ధవ • ళాంబుజ కాంతికచంద్రచంద్రికా
విలసనభవ్యకీర్తి గుణ • విశ్రుతి నేడవచక్రవర్తి వ
ర్తిలె నిల నిర్మలప్రభువ • రేణ్యుఁడు సత్కవిలోకగణ్యుఁడై.

పా. 1. సారబాహు. పా. 2. తోలుశాఖ.

సీ. పాఱుచోఁ గంపలు ♦ పట్టి బెజ్జము లైన
చెవులఁ బూమొగ్గ లొం♦ట్లవగ మెలఁగ
నెదుట మోటులు దాఁకి ♦ నుదుటఁ గ్రిమ్మిననెత్రు
జిగి కుంకుమంపుబొం♦ట్లుగను నెగడఁ
దలపాగ వో బోడి♦తలల వంటినపావ
కుబుసాల్ రుమాలచెం♦గులుగ మెఱయ
నొనరఁ గాళ్లను జుట్టు♦కొనినతీఁగలగుంపు
కొమ రొందుబిరుదుపెం♦డెముగ నమరఁ

తే. గీ. జెట్టులను కోటరములందుఁ ♦ బుట్టలందుఁ
గుంజపుంజమ్ములను డాఁగి ♦ గంజిదిండి
లండివగచెండి వజీరులు ♦ తొండుపడిరి
వసుధఁ దిరుమల విభుదాడి♦వలన నోడి.

ఉ. పంపులచేత గెల్వఁ జల♦పట్టను కూటపుమూకి గాటపుఁ
గుంపులచేత బొట్టు గడి♦కోటలు లెల్లుపట్టు మాంపులో
మంపులచేతఁ గోమలుల♦మానము కొల్లలుపట్టు నెత్తి మోత్రి
యింపులచేత మాటిరుమ♦లేంద్రుని కెవ్వరు సాటి యిమ్మహిన్.

సీ. పెలుచఁ దోమనిపళ్ళె♦ములు చేర్చుటలు మాని
యిలఁ బైఁడిపళ్ళెంబు ♦ లియ్య నేర్చె
పలుమాఱు వడ్డికా♦సులు కూర్చుటలు మాని
యెలమితోన వరాల ♦ నియ్య నేర్చె
గోరుచేరుకుకూటి♦కోరిక మాని హా
యిగనురాజాన్నంబు ♦ లిడఁగ నేర్చె
నిల మోచి తనకుఁ దె♦చ్చిమ్మనుటలు మాని
పలుమఱు నల్లిళ్లు ♦ నిలుపనేర్చె

తే. గీ. గట్టుపైఁ గాఁపురం బున్న♦గొట్టు మాని
యొనర మధురాపురమునందు ♦ నుండ నేర్చె

పరిబలుసుఖముల వేంకట • భర్త నింపు
వేడ్కలు చెలంగఁ దిరుమల • విభుఁ డనంగ.

సీ. ఆర్యానుమోదన • ప్రౌఢరీతి వహించి
యమరుసంపద హెచ్చు • కొమరుఁ బూని
పరమహీభృద్భేద • పటుశక్తి భరియించి
పరిథితసుబ్రహ్మణ్య • భావ మంది
తతమహాసేనాభి • ధానసంగతిఁ గాంచి
బహుళాత్మజస్ఫూర్తిఁ • బరిఢవిల్లి
తారకజయలీల • ధారుణి వెలయించి
శూరపద్మనియతి • జూరలాడి

తే. గీ. వాసవాపత్య వరణీయ • భాసురాంగ
పటిమవల్లీలసద్వృత్తిఁ • బరిబలుకతనఁ
దిరుమలేందురిందు కొమరుని • తీరుఁ గాంచి
పరమశివమూర్తి కరుణచేఁ • బడసెఁ గీర్తి.

సీ. హరిణాక్షులను గూడ • నతనులీలల మించె
క్షితి వసంతోత్సవం • బతిశయిల్ల
నరిభేదనస్ఫూర్తి • సురఘం డన రహించె
విజయదుర్గార్చనా • విభవ మెసఁగ
నుడిరాజనారాయ • ణుఁ డనుపేరు వహించె
లక్ష్మీవిలాసలీ • లలు చెలంగ
శరభాతిశయరీతిఁ • జాలఁ గీర్తి వహించె
వితతసింహాసన • స్థితి పొసంగ

తే. గీ. ననుచు జను లెల్ల బొగడఁ దా • నతిశయిల్లెఁ
జారుతర నిత్యశోభన • సమయమిళిత
కవి బుధవతంస వైణిక • గాయకోక్తి
తతనిజాస్థాని తిరుమల • ధరణిజాని.

సీ. పడియపట్ల నడంగు • పగరాకుమారులఁ
జెలఁగి కొమ్ముననఁ జిల్చి • చిమ్ము ఘోణి
పనులఁ గుప్పిమ్మరుగొంటు • పగకందుమన్నీలఁ
దఱిమి వెన్నాడు వే • దండసమితి
బిలమధ్యమున డాఁగు • పెరవజీరుల గిట్టి
కమలించు నిట్టూర్పు • కాఁకఁ జిల్వ
కెలనఁ జరించుమె • క్కలిగడిరాజులఁ
జెఱ నుంచు గుహాలలో • శిఖరికులము

తే. గీ. [1]తెలుచు వెలుపడఁ గముకంబు • నెలవు సొచ్చి
వారి వెడలింపఁ బో నంత • వసుధఁ దాల్చి
తమశ్రమము దీర్చుతిరుమల • ధరణినాథ
మణికిఁ బ్రత్యుపకృతి సేయ • మనసుఁ బూని.

కం. అలశ్రీ తిరుమలనాథుం
డలమేలమయందుఁ గాంచె • నఘవిచిత్రో
జ్జ్వలవిభవసాంద్ర కీర్తులు
వెలయంగఁ గుమారనుతు • వీరవేంద్రున్.

చ. భువిఁ జినముమ్మడిరన్నప • పుంగవుపాణికృపాణభిన్నశా
త్రవనృపదేహశోణితప • రంపర యింపులు గుల్కె నూత్నపీ
ఠవరణవేళ నెంతయు సు • రప్రమదాతతి యామటింపును
త్సవము ఘటిల్లఁ బెల్లుగను • చల్లిన చెంద్రికపుజల్లు కైవడిన్.

సీ. [2]వలిగట్టు వెలిపెట్టు • కళలుట్టు నెలగుట్టు
[3]వేగంటినారచెట్టు • వెండిగట్టు
వినువాలునినువాలు • నును [4]చాలుగనుమేలు
నలువబాబాలు క్రొ • న్ననలచాలు

పా. 1. తొలుదొలుత దంభకముఖంబు • నెలవు సొచ్చి. పా. 2 వలిమెట్టు తెలిబట్టు. (పా. 2. మలిమెట్టునెలిబట్టు). పా. 3. వెలగట్టిదారచెట్టు. పా. 4. చాలుగల.

జిగిమీఱు తొగసొరు♦మగరారుటపుపేరు
తఱకుమున్నెప్పఁబేరు ♦ తమ్మిపేరు
విలసిల్లునవరెల్లు ♦ తెలివల్లుకొనుజల్లు
లరదిగంబురజల్లు ♦ నురుగు[1]విల్లు
తే. గీ. నెల్లపుడు నుల్లముననఁ జాలఁ ♦ దల్లడిల్ల
నల్లనల్లన మల్లాడి ♦ యుల్లసిల్లు
తిరుమల[2]ధరేంద్రవీరధా♦త్రీపచంద్రు
కీర్తి జగతిని ననుపమ♦స్ఫూర్తి మెఱయు.
కం. క్షమ వీరేంద్రుఁడు మీనా
క్షమ నలలింగాంబ నాఁజ♦మాంభోజాతా
క్షి మఱియును మధురనాయిక
నమలమతిం బెండ్లియాడె ♦ ననుపమలీలన్.
తే. గీ. అట్లు మీనాక్షమ యయారె ♦ యాస లెంచి
స్వామితో విగ్రహముఁ జేయఁ ♦ జనక కఠిన
చాపలత డించి యశాంత♦సమరసత్వ
పటిమ మధురాపురిని వీర♦పత్ని యయ్యె.
సీ. క్షితి యవిరతరజ♦స్కతఁ గాంచి కోరనా
భర్తనెంతయుఁ గ్రిందు♦పడఁగఁ జేసె
లచ్చి యం చనఁ జంచ♦లయె ఘనత నెనంగు
నేలినవానిఱొ ♦ మ్మెక్కి నిలిచె
సతియె తాఁ బార్వతి ♦ శంకరుం డగువాని
నాత్మేశుఁ గదిసి మా♦త్రాడఁదొడఁగె
పతిదేవతయె తాను ♦ బాష దా తగువాని
ప్రాణనాయకుని నో ♦ రదుముకొనియె
తే. గీ. నని కువృత్తియును భృగుక♦లనయుఁ జండి
తయును వ్యాహారరీతిఁ జెం♦దకయ వసుమ

పా. 1. హెల్లు. పా. 2. వరేంద్రు.

తియు జగన్మాత గౌరి వాగ్దేవి యనఁగ
రంగలరె సద్గుణాలంబ లింగమాంబ.

చ. నిరుపమభర్తృభక్తి ధరణిం బొగడొందెడునాజమాంబకున్
సరి యనవచ్చు నెంతయును జాహ్నవి వెల్వెలఁబాఱ కోమధీ
వరకలనాంతజాడ్యవిమవర్తను భర్తను ధూర్తమౌళి యం
చరయుచు సారెకున్ మొరసి యాదల[1]మెట్టక యున్న నెన్నఁగన్.

కం. లలితహరిభామణ కుతూ
హలవిజయ[2]యశస్సమంచితాత్మయునై తాఁ
గలితసుభద్రాభిధయై
యలరారున్ మధురనాయికాంబ గణింపన్.

సీ. తిరుమలమేదినీవరుముద్దువీరధ
రాధినాథుండు మీనాక్షమాంబ
యం దలచొక్కనాథావనీపాలు లిం
గాంబికయందు ముద్దళగిరీంద్రు
నాజమాంబికయందు నచ్యుతేంద్రుని చిన్న
యచ్యుతు మధురనాయకమయందు
నారసింహాక్షమానాథశిఖామణి
నెన లేనివేడుకల్ హెచ్చులంగఁ

తే. గీ. గాంచె నెంతయుఁ గల్పద్రుమపంచకంబుఁ
బాలమున్నీటిచందానఁ బ్రథితదాన
[3]వర్తనంబును కీర్తివిస్ఫూర్తి మెఱయ
సరససుమనోమనోవిలాసంబు మెఱయ.

మ. వెలయున్ వారల కగ్రజుండు సుకృతావిఖ్యాతబోధుండు ని
ర్దళితానేకవిరోధియూథుఁ డహివర్యస్తుత్యమేధుండు సం
జ్వలితాబింధవగంధవాహనఖదివ్యద్భవ్యతేజోవితా
నలసద్గంధుఁడు చొక్కనాథధరణీనాథుండు భాగ్యోన్నతిన్.

---

పా. 1. యొల్లక. పా. 2. వచస్స.
పా. 3. వర్తనము వితతవిస్ఫూర్తి మెఱయ.

సీ. అలవనీపకు లెల్ల • నవనీపకుల యైరి
యెవ్వాని పటుదయా•దృష్టివలన
వెస సుధాశులునైత • మసుధాశులే యైరి
యెవ్వాని ద్విజకోటి•యిజ్యవలన
క్షితిని తిలసమాను • లతిలసమానులై
రెవ్వాని కోడవుల•యోగివలన
నౌకార చలధీరు • లచలధీరులు నయి
రెవ్వాని పదవంద•నేచ్ఛవలన
తే. గీ. రాజమాతుఁడంత యతఁడు దు•ర్వారచారి
వైరినాసీరభటవార•ఘోరశీర
వారినారాచచాపవి•స్ఫారపూర
సాధుజయహారి శ్రీ చొక్క•నాథశౌరి.

ఉ. చందనచంద్రకేతకులు • సారెకుఁ బోఁగునన్ తైఁ యెదిర్చి ని
న్నుం దగుచొక్కనాథనర•నాథునికీర్తి యహీనతఁ రహిన్
జందనవాటిఁ జుట్టుకొనఁ • జందురుఁ గబళింపఁ గేతకీ
బృందము మెట్టఁగా నెలవు•పెట్టును కొండలు చిల్వరోదులన్.

సీ. చోళంబు పగల నా•భీలకరామర్ద
గాఢాగ్నిశిఖరీతి • యూష్మఁగాంచి
మత్స్యంబు సుడివడ • మందునేసవిపూట
గాటంపుపేరెండ•కడఁక నెరపి
సింధువు శోషింప • సీమారవద్ఘోర
బాడబజ్వాలదర్పి • పటిమఁ జేర్చి
వంగంబు పైపైఁ గ•రంగ బంధురగంధ
వాహబాంధవకీల•వైపు చూపి
తే. గీ. వంపులకు రాక దొరలు గ•ర్వింపఁ గినుక
వివిధదేశంబులను దండు • విడియునపుడు
తనరుపీయరచొక్క•నాథక్షితీంద్రు
చంద్రహాసనటద్దాము•చండిమంబు.

గరక లయ్యె నరాతి•కరికుంభ రత్నంబు
సేన శేన్వరుఁ గంప•వాన గురియ

తే. గీ. ఘనుఁ డితం డని మొససిన•కాందిశీక
పారశీక శకాంగ బ•ర్బర కళింగ
వంగ బంగాళ చోళ నే•పాళభయద
ఘనవిజయధాటి ముస్తాల•ఖ్ఖారికిరీటి.

సీ. సమక్షోణిపతిచేత•నొకట గాంచిల్వకు
బదనిక లగిపేర•నవసనత్రణము
సేమగంధరుబలాం•భోధికిఁ జెలియలి
కట్టు దాయలు మెట్టు•పుట్టమెట్టు
మేధన్యకోటి•హిమ్నకీని తాపస్తంభ
ముగ్రి నైరుల కేలు•మోహ్నసరవి
మేరాజుహయసహా•సిరిదాళికిఁ దాలు
గాలి పావదరాతి•పాలియూర్పు

తే. గీ. జగతిఁ దగు నాతఁ డురురణాం•చత్కటప్రి
పంచసమధికవంగనో•దంచితాత్మ
పంచశిరువడిరాజన•హ్వాంగహరణ
కనకపరివాటి ముస్తాల•ఖ్ఖారికిరీటి.

సీ. నలుఁడు సారతరసౌం•దర్యవిభ్రమమున
ననలుఁడు తేజో•మహత్త్వమునను
భవుఁడు నితాంతసం•స్తవనీయకీర్తిని
నభవుఁడు దీర్ఘాయు•రతిశయమున
నిలుఁడు నిరుపమావ•నీభరణంబున
ననిలుఁడు పటుబల•ప్రౌఢిలీల
గదుఁడు బంధురతర•గాంధర్వకళయందు
నగదుఁ డుదారభో•గాప్తివలన

తే. గీ. నేర ఘనుఁ డనఁ దగు జపా•టీరశాటి
కాతటనటత్కరటిలోక • కర్ణయుగళ
దళనపటుతర ధణధణం•ధణనినాద
కటుపటహకోటి ముద్దుళ•ఘురికిరీటి.

శా. స్ఫారప్రాభవముద్దుళఘురినృప • ప్రోత్ఖడ్గస్ఫురద్బాహుగం
భీరాసిక్షతవైరివీరు లవనిన్ • భీతిం గరిప్రాతశుం
డారేఖం దగఁ దూఱి పచ్చికలబై•టం బాఱి రాఁజూఁతురో
దూఱుం దుండముఁ బాఱుపచ్చి కనితో•డ్తో నవ్వ భిల్లాంగనల్.

సీ. వేఱుచేసి యొసంగు • విబుధోపవనశాఖి
తనవేలఁ గాచిన • వనధి యొసఁగుఁ
గాసు గైకొని యిచ్చుఁ • గమలినీపతిపట్టి
మేఘు ముఖ్యోక్షించి • మెఱసి యొసఁగు
దరిఁ బాలు పొమ్మని • సురసురభి యొసంగు
మాఘ్రు రే పని యిచ్చు • మరునిమామ
యమ్మ మీఱ నొసంగు • నెంతయును దక్షిచి
తులఁ దూఁచి యల శిబీం•ద్రుం డొసంగు.

తే. గీ. ననుచుఁ దొలుతటివాతల • నపహసించి
నిత్యవిశ్రాణనస్ఫూర్తి • నెగడ మిగుల
జగతిఁ దగుశాత్రవదురాప•చాపరోప
కలితజయహారి ముద్దుళ•ఘురిమురారి.

ఉ. శ్రీపతి యల్లముద్దళఘు•రిప్రభుఁ [1]డయ్యె మహోన్నతుల్ దగన్
భూపతి యాట యంత రహిఁ • బొల్చు కమన్ భుజసీమఁ దాల్పఁగా
నాపగ నంతకన్నఁ బొడ•వై తగునట్టి తదక్షికోణమున్
బ్రాపుగ నెంచి నిల్చె వన•రాశితనూజ యహంక్రియోన్నతిన్.

మ. జలవంశంబునఁ బుట్టి రట్టు నతిచాం•చల్యాయశంబు న్దనన్
మెలఁగం గోరి విశుద్ధవంశమున ల•క్ష్మీదేవి లక్ష్మీసతీ

పా. 1. బై జనియించితాఁ డగన్.

తిలకంబై జనియించి సుస్థిరగుణా॰ధిక్యంబుఁ జెందం దదా
కలనన్ ముద్దళఘేందుచ్రిఁ డర్మిలిఁ గనున్ ॰ గార్హస్థ్యధర్మోన్నతుల్.

మ. సరసీజాక్షుఁడు చక్రిధారి యయి ని॰చ్చల్ హెచ్చు శ్రీముద్దల
క్ష్మిరిశౌరి స్మరియించు నాత్మజనిలీ॰లన్ శ్రీ యనం బొల్చు బం
గరుసామ్మె యది రుక్మిణీత్వము తగం॰గా ధారుణిన్ రుక్మిణీ
హరిణీలోచన వన్నెఁ గాంచెను సము॰ద్యల్లోకముఖ్యస్థితిన్.

మ. అనఘుం డైనకుమారుఁ గాంచి శుభవి॰ద్యామూర్తి యా నన్నకీ
ర్తిని నల్వొంది రమావిలాస మమరన్ ॰రీతిన్ విజృంభించి చ
ల్లనిలేఁజూపుల సందడి న్మనుచుల॰లం బొల్చె నాథ్యత్వ మా
నన ముద్దక్షరిరాజమౌళిసతి మీా॰నాక్ష్యంబ భాగ్యోన్నతిన్.

ఉ. ఆన్నపచంద్రితమ్ముఁ డని॰శార్చితసిలగఖండు సర్వవి
ద్యానిపుణుండు ధన్యుఁడు వ॰దాన్యశిఖామణి దివ్యకీర్తికాం
తానవమన్మథుండు కవి॰తాచతురుండు చెలంగు జన్యసీ
మానటితోరుశౌర్యఖని ॰ యచ్యుతశౌరి యశోవిహారియై.

సీ. ఉగ్గుఁ బెట్టకమున్న ॰ యుదయించె నాశ్రిత
జనులపై నాశక్తి ॰ శంభుభక్తి
మాట నేరకమున్న ॰ సే టంటె సత్యంబు
గురువైనధర్మాను॰కూలబుద్ధి
[1]మృదువు వెలుంగకమున్న ॰ పొడవెను సాహిత్య
ఖేలనంబు కవీంద్ర॰లాలనంబు
పాదు కదుమరీతి ॰ పనుపడకయమున్న
వర్ణాశ్రమప్రేమ ॰ వాసిఁ గనియె

తే. గీ. నెంతయును వింత యని ధరా॰కాంతుసమితి
సంతతము సంతసమ్మున ॰ సన్నుతింప
వెలయు నిలలోన నసమాన॰విభవ మమర
శుభగుణస్థాని యచ్యుత॰క్షోణిజాని.

---

పా. 1. మృదువు నేరకమున్న.

శత్రుపార్థివగేహ♦చిత్రితఘనులకు
వల్మీకగర్భభూ♦వసతి పొసఁగె
రిపుమహీమిహికాంశు♦గృహచకోరికల కం
గారసత్రంబు ల♦వ్వారి యయ్యెఁ
బరిపంథిమనుజేంద్ర♦భవనకేకినులకు
ఘోరకాంతారసం♦చార మొదవె

తే. గీ. విదిత తిరుమలన్నృపవీర♦విభుకుమార
వీరముద్ధళ రిపుప్రభు♦విజయధాటి
కానిరాఘాటచతురంగ♦ఘనచమూస
మూహమోహో దిశల్ చుట్టు♦ముట్టినపుడు.

సీ. చెంగల్వరాయఁడు ♦ చేరుచుక్క నొసంగ
వలిగట్టు వజ్రసీ♦మల ఘటింపఁ
గుండలిగ్రామణి ♦ కుటుసంబు నొసఁగఁగూర్పఁ
గైలాసగిరి గూపు♦కటక మిడఁగ
గాంగప్రవాహము హంస♦కములఁ జేర్పఁగఁ బాల
మున్నీరు ముత్యపు♦మురువుఁ జూప
నంబరపరశాఖి ♦ యలరుదండలఁ బూన్ప
వంకకొప్పున నెల♦వంక యునుప

తే. గీ. నందనుఁడు నన్నిహాపులై ♦ యష్టదిగ్వి
జృంభితానేకలీలలై ♦ చెలఁగి జగతి
నెంతయు నటించె ముద్దళ♦రీంద్రచక్ర
వర్తి మూర్ధన్యమంజుల♦కీర్తికన్య.

సీ. కడగట్టువెన్ను చీ♦కటిఁ గొట్టుఁ గాని శ
త్రుగృహాంధకారముల్ ♦ దునుమలేదు
కడలి శోషింపఁ జొ♦ప్పదుఁ గాని పగరాచ
చెలులకన్నీరు రాఁకఁ ♦ జేయనేర

దనలత్రియోన్మేష • మణఁచుఁ గాని విరోధి
పురు లేర్చుశిఖఁ గొంచె • ¹పఱచలేదు
రోదసి మెఱయింపు • రుచి నింపుఁ గాని భీ
తవిరోధిదిగ్భ్రాంతి • తరపఁజనదు
తే. గీ. బళిరె యిది వింత యనఁ దగు • బలసమిద్ధ
ఘనసమరబద్ధ వీరకం • కణసమగ్ర
ధీరముద్ఘరిక్షమా • ధిప కరాగ్ర
మండలాగ్రప్రతాపార్క • మండలంబు.

శా. జాగ్రై యింపుగఁ బల్కుకుల్కునుపుల్ • జగ్గుల్ తగ న్నిత్యక
ల్యాణస్ఫూర్తి నెసంగఁగా జతులు చా • లా మించి రాణించఁగా
నేగాత్రీతతి ముక్కులక్ష్మరిధరి • త్రీశుండు లాలించి తా
వీణావాద్యమునేర్పు మీటువగ నౌ • వింతం దనంతః రహిః.

సీ. చల్లనిమల్లెపూ • జల్లు లెత్తినభాతి
నన తేనెసోనలు • నునుచుకీతిఁ
గమ్మకప్రపుదుమా • రమ్ములచందాల
వింతకస్తురివీణ • విష్వలీల
సంపఁగిపుప్పొడి • గుంపు గుప్పినబాలిఁ
బునుఁగుతాలకీవి • పెనఁగుహాళిఁ
బన్నీటి చిట్టాట • పరిఢవిల్లినజాతిఁ
బల్కునెచ్చెలివీణ • పల్కుకీతిఁ
తే. గీ. జల్లఁదన ముల్లసిల్లంగ • నెల్లవారు
నౌర సెబాసు మేలు మ • జ్ఝారె యనఁగఁ
బ్రౌఢి మెఱయంగ సాహిత్య • రచన సేయు
నపుడు ముష్టికఘురిశౌరి • రిపువిదారి.

సీ. తిరముగా నలపార్వ • తీలోచనము పర్వ
రాజచూడామణి • ప్రౌఢి మెనఁగ

---

పా. 1. పఱపఁజనదు.

